The First Engraving on Stone in Telugu :

# The Engravers

by *Sriramoju Haragopal*



తెలంగాణ చరిత్ర ఒక ఊటబావి. తోడుకున్న వారికి తోడుకున్నంత చరిత్ర నేటి నూతన తరం పరిశోధకులకు, అన్వేషకులకు లభ్యమవుతున్నది. అలా లభ్యమైన వాటిల్లో ఒకటి "తొలుత రాతి రాత తొలుచువాన్డ్రు.." ఇదే తొలి తెలుగు శాసనం. కీసర గుట్ట మీద 1967లో పురావస్తు శాఖ గుర్తించిన శాసనం. ఇది 5వ శతాబ్ది తొలిపాదం నాటిదని, 7వ శతాబ్ది నాటిదని భిన్నాభిప్రాయాలు చరిత్రకారులు వెలుబుచ్చారు. అయినప్పటికీ 5వ శతాబ్దం తొలి పాదం నాటిదనే అభిప్రాయం బలంగా ఉంది. శాసనాల వర్గీకరణలో భాగంగా ఈ శాసనాన్ని లేబుల్ శాసనం అంటారట. రాయి, రేకు వంటి ఘనపదార్థాలపై గీసిన, చెక్కిన రాత ఏదైనా లేఖనమేనని చరిత్రకారులు శాసనాన్ని నిర్వచించారు. ఈ నిర్వచనాల్లోనూ భిన్నాభిప్రాయాలున్నాయి. ప్రతి లేఖనమూ శాసనం కాదని రాజాజ్ఞ ఉన్నదే శాసనమనే అభిప్రాయమూ ఉంది. ఇందులోని సమాచారం చరిత్ర పట్ల విలువైన ఎరుకను ఇస్తుందనడంలో సందేహం లేదు.

– దక్కన్ హెరిటేజ్ అకాడమీ ట్రస్ట్, హైదరాబాద్

₹ 45/-





ISBN : 978-81-960987-0-4


"BHOOPATHI SADAN" 3-6-716, Street No. 12, Himayatnagar, Hyderabad-500029. Telangana.



Toluta Telugu Raatiraata

# Toluchuvaandru

తొలుత తెలుగు రాతిరాత

# తొలుచువాండ్రు

శ్రీరామోజు హరగోపాల్

Sriramoju Haragopal






"BHOOPATHI SADAN" 3-6-716, Street No. 12, Himayatnagar, Hyderabad-500029. Telangana.

The First Engraving on Stone in Telugu :
**The Engravers**

# తొలుత తెలుగు రాతిరాత

# తొలుచువాండ్రు

**శ్రీరామోజు హరగోపాల్**

**Sriramoju Haragopal**



DECCAN
HERITAGE
ACADEMY TRUST

**DECCAN HERITAGE ACADEMY, "BHOOPATHI SADAN"**
3-6-716, Street No. 12, Himayatnagar, Hyderabad-500029. Telangana.
Fax: 040-27635644 Mobile: 9030626288
E-mail: heritagedeccan@gmail.com; website : www.deccanheritage.org



తొలుత తెలుగు రాతిరాత

**తొలుచువాండ్రు**

శ్రీరామోజు హరగోపాల్

Toluta Telugu Raatiraata

**Toluchuvaandru**

*by* ***Sriramoju Haragopal***

*First Edition : February, 2023*

*Copies : 500*



*Price :* **Rs. 45/-**

*ISBN No. 978-81-960987-0-4*

*Published by :*
***Er. Veda Kumar Manikonda,*** *Chairman*
*Deccan Heritage Academy,*
*Hyderabad, Telangana.*

*For Copies :*
DECCAN HERITAGE ACADEMY
*"BHOOPATHI SADAN" 3-6-716, Street No. 12,*
*Himayatnagar, Hyderabad-500029.*
TELANGANA.
email: heritagedeccan@gmail.com
*Mobile : 9030626288*
**website : www.deccanheritage.org**

Navodaya Book House • Nava Telangana • Nava Chetana

*Cover Photo : Sriramoju Haragopal*

*Book & Cover Design : Er. Veda Kumar Manikonda*

*Printed at :*
DECCAN PRESS Azamabad, Hyderabad. Ph.+91-040-27678411
e-mail : deccan.press@yahoo.com






# చరిత్ర పట్ల విలువైన ఎరుక

చరిత్ర నిర్మాణానికి కొనసాగింపే కాని ముగింపు ఎప్పటికీ ఉండదు. నిన్నటిని తుడి చెయ్యడం కాదు; దానికి నేడును తోడు చేయడమే చరిత్ర రచన. వక్రీకరణలకు లోనైన అంశాలను సరిదిద్దడం, పునర్మూల్యాంకనం చేయడం, పునర్లిఖించడం చరిత్ర సజీవంగా కొనసాగడానికి పాటించవలసిన విద్యుక్త కర్తవ్యాలు.

అన్ని రంగాల వలె చరిత్ర రచనలోనూ తెలంగాణ వివక్షకు గురయింది. అవహేళనలనూ భరించింది. ప్రతి భౌగోళిక ప్రాంతానికీ, ఆ ప్రాంతంలో నివశించే జన సమూహానికీ తమదంటూ ఒక ప్రత్యేక చరిత్ర, సంస్కృతి, జీవన విధానమూ ఉంటాయి. ఆధిపత్య భావజాలం ఈ వాస్తవాన్ని గుర్తించడానికీ, అంగీకరించడానికీ సిద్ధంగా ఉండదు. ఇప్పుడు తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పడక ముందు, ఏర్పడిన తరువాత అంటూ చరిత్రను అధ్యయనం చేయవలసి ఉంటుంది. తెలంగాణ చరిత్ర రచనలో పేజీలు ఖాళీగా ఉన్నాయి తప్ప మహోన్నత ప్రాచీన చరిత్రకీ, సంస్కృతికీ, జ్ఞానానికీ, వారసత్వ సంపదకీ కొదువలేదు. ఇప్పుడు చేయవలసింది ఆ ఖాళీలను పూరించడమే. తెలంగాణ చరిత్ర పట్ల అంతులేని ప్రేమ, ఆసక్తి కలిగిన యువ మేధావులతో, విద్యావంతులతో ఏర్పడిన 'కొత్త తెలంగాణ చరిత్ర బృందం' మరుగున పడిన తెలంగాణ చరిత్రను వెలికితీయడంలోనూ, కొంగ్రొత్త వాటిని అన్వేషించడంలోనూ, చరిత్రను పునర్లిఖించడంలోనూ చేస్తున్న కృషి అభినందనీయం.

తెలంగాణ చరిత్ర ఒక ఊటబావి. తోడుకున్న వారికి తోడుకున్నంత చరిత్ర నేటి నూతన తరం పరిశోధకులకు, అన్వేషకులకు లభ్యమవుతున్నది. అలా లభ్యమైన వాటిల్లో ఒకటి 'తొలుత రాతి రాత తొలుచువాన్డు.." ఇదే తొలి తెలుగు శాసనం. కీసర గుట్ట

మీద 1967లో పురావస్తు శాఖ గుర్తించిన శాసనం. ఇది 5వ శతాబ్ది తొలిపాదం నాటిదని, 7వ శతాబ్ది నాటిదని భిన్నాభిప్రాయాలు చరిత్రకారులు వెలుబుచ్చారు. అయినప్పటికీ 5వ శతాబ్దం తొలి పాదం నాటిదనే అభిప్రాయం బలంగా ఉంది. శాసనాల వర్గీకరణలో భాగంగా ఈ శాసనాన్ని లేబుల్ శాసనం అంటారట. రాయి, రేకు వంటి ఘనపదార్థాలపై గీసిన, చెక్కిన రాత ఏదైనా లేఖనమేనని చరిత్రకారులు శాసనాన్ని నిర్వచించారు. ఈ నిర్వచనాల్లోనూ భిన్నాభిప్రాయాలున్నాయి. ప్రతి లేఖనమూ శాసనం కాదని రాజాజ్ఞ ఉన్నదే శాసనమనే అభిప్రాయమూ ఉంది.

మన చరిత్ర బృందం కీసర గుట్టలో కనుగొనబడిన దానిని తొలి తెలుగు శాసనమని పురావస్తు శాఖ ప్రకటించాలని, ప్రభుత్వం పాఠ్యాంశాలలో చేర్చి 'తొలి తెలుగు శాసనం' ప్రాశస్త్యం కల్పించాలని కోరుతున్నది. ఆయా సంబంధిత అధికారుల దృష్టికి తీసుకుపోయి సంస్థాగత ప్రయత్నాలను చేస్తున్నది. వివిధ రంగాల ప్రముఖులతో చర్చను నిర్వహించింది. ప్రముఖ చరిత్రకారులు అనేక మంది ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తూ ఈ కృషికి బాసటగా నిలుస్తున్నారు. త్వరలో పురావస్తు శాఖ 'తొలి తెలుగు శాసనం'గా ప్రకటిస్తుందని, ప్రభుత్వం పాఠ్య గ్రంథాలలో చేరుస్తుందని ఆశిద్దాం. మనమూ బాసటగా నిలుద్దాం.

శ్రీ రామోజు హరగోపాల్ 'కొత్త తెలంగాణ చరిత్ర బృందం'లో ముఖ్యులు. ఈ చిన్ని పుస్తకంలో 'తొలుత తెలుగు రాతిరాత తొలుచువాన్డు' గురించి మాత్రమే కాక శాసనాలు – వాటి చరిత్ర, శాసనాలు దొరికిన స్థల, కాల విశేషాలు, అప్పటి పాలకుల వివరాలతో పాటు, దొరికిన నాణేలు, శాసనాలు ఆధారంగా అప్పటి పాలకుల వంశక్రమాన్ని వివరించారు. చరిత్ర, సంస్కృతిని నిర్వచించడంలో నాణేలు, శాసనాలు, రాతప్రతులు, మౌఖిక, లిఖిత సాహిత్యాల పాత్రను వివరించారు. ఇందులోని సమాచారం చరిత్ర పట్ల విలువైన ఎరుకను ఇస్తుందనడంలో సందేహం లేదు.

హరగోపాల్ దక్కన్‌లాండ్ మాసపత్రికలో చాలా కాలంగా కాలమ్ నిర్వహిస్తున్నారు. అవన్నీ కలిపి 'తెలంగాణ చరిత్ర తొవ్వల్లో...' అనే పుస్తకం దక్కన్ హెరిటేజ్ అకాడమీ ప్రచురించింది. ఈ రెండు పుస్తకాలు చరిత్ర అధ్యయనపరులకు, పరిశోధకులకు దీపదారులు.

ఎప్పటివలె వీటినీ ఆదరిస్తారని ఆశిస్తూ...

హైదరాబాద్
ఫిబ్రవరి, 2023

వేదకుమార్. ఎం
(Vedakumar. M)
Governing Council Member
INTACH, New Delhi.

# విషయసూచిక

# 1 తొలుత తెలుగు రాతిరాత

తెలుగు భాష అన్ని భాషల లెక్కనె తొలుత మాట్లాడే (మౌఖిక) భాషే. తెలుగు మాట్లాడినవాండ్లనే తెలుగువాండ్లు అన్నారు. తెలుగువాండ్లున్నదే తెలుగుదేశం. తెలుగువాండ్లు పాలించిందే తెలుగు రాజ్యం. తెలుగు ఎప్పట్నుంచి ఉన్నదనడానికి చరిత్ర లోతులకు పోయినకొద్ది కొత్త సంగతులు తెలుస్తూనే ఉన్నాయి.

విస్తారమైన భారత ద్వీపకల్పంలో తెలంగాణా ఒక భౌగోళిక భాగం. ఈ ప్రాంత ప్రదేశాలలోని చరిత్ర, సంస్కృతుల నడుమ సమరూపత(similarity) ఉంది.

**తెలుగువాండ్లు:**

భౌగోళికంగా గోదావరి నదీతీరాననే తెలుగువాండ్ల ఉనికి, మనికి చరిత్రలో అగుపిస్తాయి. క్రీ.పూ. 8వ శతాబ్దం నాటికే అస్సక(అశ్మక) జనపదం ఉంది. మిగతా జనపదాలకు సమకాలీనంగా వున్న అస్సక ఉనికి తెలంగాణా భూభాగంలోనిదే. క్రీ.పూ. 1000సం.రాలకు పూర్వమే 'ఆంధ్ర'ప్రదేశంగా గుర్తించబడ్డది తెలంగాణా భూభాగం. ఆంధ్రుల ప్రస్తావనలు రామాయణ, మహాభారతేతిహాసాల్లో కనిపిస్తున్నది. క్రీ.పూ. 500ల సం.రాల నాటి బౌద్ధగ్రంథాలలో గోదావరి లోయలో 'అంధరకట్ట' ఉందని చెప్పబడ్డది. నిజామాబాద్ జిల్లా గోదావరినది తీరప్రాంతం నుంచి మహారాష్ట్రలోని ఔరంగాబాద్ జిల్లా వరకు ఉన్న భూభాగం 'అంధరకట్ట'గా పిలువబడ్డది. దాని పాలకులు అస్సకులు. నిజానికి ఆంధ్రుల ప్రస్తావన ఐతరేయ బ్రాహ్మణంలోనే వస్తుంది. సామంత వసదిక అనే బౌద్ధగ్రంథం ఆంధ్రులను, తమిళులను కలిపి సంబోధిస్తుంది.

ఐతరేయ బ్రాహ్మణం పేర్కొన్న తెగల్లో 'ఉదంత్యః' అంటే ఆర్యరాజ్యం సరిహద్దులకు అవతల ఉండేవారు దస్యులని. వాళ్ళు ఆంధ్రులు, పుండ్రులు, సవరలు, పుళిందులు, మూతిబులు (సాంఖ్యాయన సరస్సూత్రలో చెప్పినట్లు విశ్వామిత్రుడు శపించిన తన 50 మంది కొడుకులు కలిసిన జాతులు). వీరంతా గంగానది కింది

లోయల్లో నర్మద, గోదావరి, కృష్ణానదుల ప్రాంతాలలో వుండేవారు. వారిలోని ఒక సమూహం అంధ్‌లు విదర్భలోని బుల్దానా జిల్లాలో నివసించేవారు. దస్యతెగల్లో ఆంధ్రులు ద్రవిడులై ఉంటారు. వీరికి పొరుగున జీవించిన ప్రాచీనతెగలను పేర్కొంటాడు సిల్వెన్ లెవీ. అవి కోసల-తోసల, త్రిలింగ-కళింగలు.

క్రీ.పూ.326లో మెగస్తనీసు తన ఇండికాలో ఆంధ్రులను పేర్కొన్నాడు. వారికి 30 దుర్గాలున్నాయని, పెద్ద సైన్యమున్నదని ఇండికాలో వివరాలున్నాయి. చరిత్రకారులు అంధ అనే ప్రాకృతరూపమే సంస్కృతీకరించబడి ఆంధ్రగా పిలువబడ్డదంటారు. మాములనార్ అనే సంగం వాఙ్మయ కాలానికి (క్రీ.శ.1-3శ) చెందిన తమిళకవి 'అహనానూర్, పురనానూర్' అనే గ్రంథాలలో మౌర్యులు ద్రవిడదేశంపై దండెత్తినపుడు మౌర్యసైన్యానికి ముందుగా 'వడుగర్ల' సైన్యం నడిచిందని రాయబడివుంది. తమిళంలో వడుగర్లు అంటే ఉత్తరాదివాండ్లు-'తెలుగువాండ్లు' అని అర్థం.

క్రీ.పూ. 260 ప్రాంతంలో వేయబడిన అశోకుని 13వ శాసనంలో కళింగ విజయప్రస్తావనతోపాటు 'నా రాజ్యంలో దరదులు, విషవాజులు, నాభాగలు, నాభపంక్తులు, భోజులు, యవనకాంభోజులు, పితినిగుల్యులు, పుళిందులు, ఆంధ్రులు మొదలైన ప్రజలు దేవానాంప్రియుని ధర్మశాసనాన్ని అనుసరిస్తున్నారు' అని చెప్పబడ్డది. అశోకుని తర్వాత సాతవాహనపూర్వపు స్థానికరాజులు తెలంగాణాలో స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించివుంటారు.

**తెలుగుభాష:**

తెలుగు భాషగా ప్రాచీనకాలం నుంచి వాడుకలో వుందనేది నిజం. క్రీస్తుకు పూర్వకాలంలోనే తెలుగుభాషలో రచనలున్నాయని చెప్పడానికి త్రిపిటకాల అనువాదాలే సాక్ష్యం. ఇవి 'అంధక' భాషనుంచే పాళిభాషలోనికి అనువదించబడ్డాయని 'మజ్జె నికాయం' పీఠికలో బుద్ధఘోషుడు వివరించాడు. అంతేకాదు బౌద్ధగ్రంథం అష్టసహస్రికలో ఎక్కువ భాగం అంధకశాఖీయులే రచించారని తెలుస్తున్నది. ఆంధ్రీ అనే భాష భరతుని నాట్యశాస్త్రంలో, వాత్స్యాయనుని కామసూత్రాలలో ప్రస్తావించబడ్డది. అంధకాట్ట కథ క్రీ.పూ. 3వ శతాబ్దం నాటిది. పాళీ వాఙ్మయ చరిత్రకారుడు విమలచరణ్ 'Presumably it (The Andhaka Atta Katha) was written in native dialect of Deccan' అన్నాడు.

బౌద్ధజాతక కథలు పాళీభాషలో రచించబడ్డా, చాలాచోట్ల వాటిలో కూడా తెలుగుమాటలున్నాయని శివశంకరశాస్త్రి తెలిపారు. హాలుని గాథాసప్తశతిలో

'తెలుగుమాటల' కుప్పలున్నాయి. సాతవాహనుల వెండినాణాలమీద రెండు భాషలలో పేర్లు అగుపిస్తాయి. వాటిలో ఒకటి ప్రాకృతం, రెండవది తెలుగా? సాతవాహన పూర్వరాజులు నారన, కంవయ(కంబయ), గోబద, సిరివయ, సిరికామనంటి పేర్లు తెలుగువే. అన్న, అయ్య తెలుగుభాషలోనే ఉన్నాయి. సాతవాహనరాజు పులుమావి పేరు తెలుగే. పులు అంటే గడ్డి. మావి అంటే ఉమ్మనీటితిత్తి.

తెలుగువారైన నాగార్జునుడు, ఆర్యదేవుడు, దిన్నాగుడు మహాయాన బౌద్ధగ్రంథాలు రచించారు. 4వ శతాబ్ది నుంచి బ్రాహ్మణీకం, భూస్వామ్య వ్యవస్థలు సామాజికంగా బలపడడంతో సంస్కృతభాష వాడుకం పెరిగిపోయింది. తెలుగు ప్రజలవాడుకంలో ఉన్నా, రాజభాషగా స్థిరపడ్డది సంస్కృతం. తెలంగాణ ప్రాంతాన్ని కన్నడిగులైనవారు పాలించడంవల్ల వారి అధికారభాష కన్నడం కావడంవల్ల కూడా కాకతీయుల కాలం దాక తెలుగులో శాసనాలు కనిపించలేదు.

సాతవాహనరాజులు 6గురి నాణాల మీద రెండుభాషల్లో పేర్లున్నాయి. రెండవ భాష తెలుగేనంటాడు నడుంపల్లి శ్రీరామరాజుహోహోహోహోహో. నాణాలమీది పేర్లు తెలుగులోనే కాదు తెలుగు ఛందస్సులో ఉన్నాయని గుర్తించారు భాషా, సాహిత్య వేత్తలు.

ఉదా:

1. ప్రాకృతం: రా వాసిరీ పుతస సిరిపులుమావిస
   తెలుగు: అఱహణకు వాహిట్టీ మాకణకు తిఱు పులుమావికు
2. ప్రాకృతం: రా వాసిరీ పుతస సిరిసాతకణిస
   తెలుగు: అఱహణకు వాహిట్టీ మాకణకు తిఱు హాతకణకు
3. ప్రాకృతం: రా గోతవిపుహతస సిరియ సాతకణిస
   తెలుగు: అఱహణకు గోతమీపుతకుహిరు యహ తకణికు

వీటిలో తెలుగు వాక్యాలు ఐదేసి మాత్రలున్న 5గణాలుగా పాటించబడ్డాయి. వీటిలోని ఛందోవిశేషాలను పురాణం రాధాకృష్ణశర్మ, ఐకెశర్మలు గుర్తించారు. వీటి ఆధారంగా క్రీ.శ. 1వ శతాబ్దంనాటికే అంటే రెండు వేల యేండ్ల కిందటనే తెలంగాణాలో తెలుగుభాషలో ఛందో లక్షణాలున్నట్లు, తెలుగుభాషలో వర్ణం, పదం, ప్రత్యయం, వాక్యం వంటి భాషాలక్షణాలు, లిపి సంకేతాలు నిర్ధారితంగా ప్రజోపయోగంలో ఉన్నట్లు చెప్పవచ్చు.

## విష్ణుకుండినుల పాలనాకాలం: శాసనాలు

ప్రస్తుతాంశం విష్ణుకుండినుల కాలంలో బండరాతిమీద తొలుచబడిన 'తొలుచువాన్డు' కనుక వారి పాలనాకాలంలో శాసనాలు, వాటి వివరాలను పరిశీలించాలి.

### విష్ణుకుండినుల శాసనాలు దొరికిన స్థల, కాల విశేషాలు:

| శాసనం | కాలం | స్థలం | సూచిక | విశేషాలు |
|---|---|---|---|---|
| 1. 1వ గోవిందవర్మ | క్రీ.శ.459 | తుమ్మలగూడెం, యాదాద్రి జిల్లా | ఇఎ-2:9-13 | |
| 2. 2వ మాధవవర్మ | క్రీ.శ.499 | వేల్పూరు, సత్తెనపల్లి, గుంటూరు జిల్లా | ఇఐ37:128-129 | శిలాశాసనం |
| 3. 2వ మాధవవర్మ | .... | ఈపూరు, తెనాలి, గుంటూరు జిల్లా | ఇఐ17:334 | ప్రాకృతంలో |
| 4. 2వ మాధవవర్మ | క్రీ.శ.499 | సతారా జిల్లా, మహారాష్ట్ర | ఇఐ27:316-317 | తొలిపత్రం లేదు, మలిపత్రం శిథిలం |
| 5. 3వ మాధవవర్మ | క్రీ.శ.510 | రామతీర్థం, చిక్కుళ్ళ, తెనాలి, గుంటూరు జిల్లా | ఇఐ17:338 | |
| 6. ఇంద్రవర్మ | | విశాఖపట్టణం జిల్లా | ఇఐ17: 134 | |
| 7. 2వ విక్రమేంద్రవర్మ | క్రీ.శ.565 | చిక్కుళ్ళ, తుని, తూ.గో. జిల్లా | ఇఐ4: 196-197 | |
| 8. 2వ విక్రమేంద్రవర్మ | క్రీ.శ.565 | తుమ్మలగూడెం, యాదాద్రి జిల్లా | ఇఎ2: 10-12 | |
| 9. 2వ విక్రమేంద్రవర్మ | క్రీ.శ.569 | తుండి, తుని, తూ.గో. జిల్లా | ఇఐ36:10-12 | |
| 10. 4వ మాధవవర్మ | క్రీ.శ.612 | పొలమూరు, రామచంద్రాపురం, తూ.గో.జిల్లా | జిఎహెచ్ఆర్ఎస్ 6:19-21 | నకిలీ |

## శాసనాల ఆధారంగా నిర్మించిన విష్ణుకుండినుల వంశక్రమం: బిఎస్ శాస్త్రి

| పాలకులు | బిఎస్ శాస్త్రి | నేలటూరి వె.ర. | ఆం.ప్ర.స.చ.సం.2 | బిఎస్సెల్ హ.రా. | నీలకంఠశాస్త్రి |
|---|---|---|---|---|---|
| మహారాజేంద్రవర్మ | 358-370 | 358-383 | 375-400 | 375-400 | |
| 1వ మాధవవర్మ | 370-398 | 383-408 | 400-422 | 400-424 | |
| 1వ గోవిందవర్మ | 398-435 | 408-445 | 422-462 | 425-465 | |
| 2వ మాధవవర్మ | 435-470 | 445-482 | 462-502 | 465-515 | 440-460 |
| దేవవర్మ | 470-473 | | | | |
| 3వ మాధవవర్మ | 473-522 | 482-529 | | | |
| విక్రమేంద్రవర్మ | 522-528 | 502- 527 | 515-525 | 460-480 | |
| ఇంద్రభట్టారకవర్మ | 528-556 | 529-556 | 527-555 | 525-555 | 480-515 |
| విక్రమేంద్ర భట్టారకవర్మ | 556-570 | 556-570 | 555-572 | 515-535 | |
| 2వ గోవిందవర్మ | 570-576 | | | 535-556 | |
| 4వ మాధవవర్మ | 576-623 | 546-594 | 564-612 | 556-616 | |
| మంచనభట్టారకుడు | 623-624 | | | | |

# 2 చరిత్ర-శాసనాదులు

చరిత్రరచనకు ప్రాథమికమైన ఆధారాలు శాసనాలు, నాణాలు, నిర్మాణాలు, తర్వాత మౌఖిక, లిఖిత సాహిత్యం.

ఇందులో శాసనం అనే సంస్కృత పదానికి 'శాసించేది' అంటే రాజాజ్ఞబద్ధమైనదనే అనే అర్థం వస్తుంది. నిజానికి శాసనమనే మాట ఒక రూఢ్యర్థమే కాని, నైఘంటికార్థంగా తీసుకుంటే సరిపోదు. ఎందుకంటే ఏదైనా గట్టిపదార్థం మీద (రాయి, రేకులవంటివి) చెక్కిన, గీసిన రాత ఏదైనా లేఖనమేనని చరిత్రకారులు 'శాసనాన్ని' నిర్వచించారు.

J.F.Fleet శాసనాన్ని 'notifications, very frequently of an official character, and generally more or less of a public nature, which recite facts, simple or complex with or without date and were intended to be lasting records of the matter to which they refer' అని నిర్వచించాడు.

లేఖనాలు వాటి పొడవు విషయంలో వైవిధ్యంతో ఉంటాయి. కొన్నిసార్లు ఒక శాసనం ఒక గుర్తు లేదా ఒక పదంతో వ్యక్తీకరణం అంటే ఒక పేరు కావచ్చు. ఏదైనా శాసనమే (లేఖనమే). ఒక్క పదం నుంచి పెద్ద కావ్యమంత శాసనరూపాలు కూడా మనకు లభించాయి. దేనికైనా చారిత్రకంగా గుర్తింపు ఉంటుంది. ఇప్పటికి ఏది శాసనమో తేల్చడానికి ఎవరి 'మాపనాలు' వారికున్నాయి. సాధారణమైన అర్థంతో చెప్పుకుంటే 'శాసనాలన్నీ' లేఖనాలే. లేఖనాలన్నీ శాసనాలు(రాజాజ్ఞ అర్థంలో) కావు'.

తెలుగునాట తొలి శాసనాలు అనబడేవి రాళ్ళమీద, రాగిరేకుల మీద కాదు నాణాల మీద తెలుగుపేర్లతో బ్రాహ్మీలిపిలో కనిపించాయి. సాతవాహన పూర్వరాజులు, సాతవాహనులు, ఇక్ష్వాకుల కాలాల్లో లభించిన శాసనాలన్నీ ప్రాకృతభాషలో, బ్రాహ్మీలిపిలో కనిపించాయి. బ్రాహ్మీలిపిలో కూడా పరిణామాలు చోటుచేసుకున్నాయి. మౌర్యుల కాలంలో, సాతవాహన పూర్వరాజుల కాలంలో, సాతవాహనుల కాలంలో, ఇక్ష్వాకుల కాలంలో ఈ లిపిభేదాలను, మార్పులను గమనించవచ్చు. అశోకుని

శాసనాల బ్రాహ్మీలిపికి సాతవాహనుల కాలం నాటికి బ్రాహ్మీలిపిలో మార్పులు స్పష్టం. ఇక్ష్వాకుల కాలంలో బ్రాహ్మీలిపి అలంకృతశైలితో కనిపిస్తుంది.

విష్ణుకుండినులకు సమకాలికులైన వాకాటకుల శాసనాలు బాక్స్ టైప్ బ్రాహ్మీలిపిలో అగుపిస్తాయి.



ఇక్ష్వాకుల శాసన లిపి వాకాటక శాసన లిపి విష్ణుకుండిన శాసన లిపి

విష్ణుకుండినుల కాలంలో గోవిందవర్మ చైతన్యపురి శాసనంలోని బ్రాహ్మీలిపిలో మార్పులు కనిపిస్తాయి.

ఆ శాసనం మీద ఉత్తరాది ప్రభావం ఉండవచ్చు నంటాడు పివి పరబ్రహ్మశాస్త్రి. గోవిందవర్మ కుమారుడైన 2వ మాధవవర్మకాలంలో కీసరగుట్ట మీద రాతిగుండు మీద చెక్కిన శాసనం 'తొలచువాండ్రు' వృత్తాలతో అలంకరించబడిన, బ్రాహ్మీనుంచి పరిణతి చెందుతున్న కొత్తశైలి తెలుగు లిపి.

తెలుగులిపి పరిణామపట్టికను పరిశీలించినా ఈ అక్షరాలు 5వ శతాబ్దానివేనని చెప్పవచ్చు.



తొలుచువాండ్రు

5వ శతాబ్దంనాటికి మారిన బ్రాహ్మీలిపిలో 'ల' ౖ గాను, 'చ' ౖ గాను, 'వ' ౖ గాను లేఖనాలలో కనిపిస్తున్నాయి. బ్రాహ్మీలిపి నుంచి తెలుగులిపిలోనికి మారుతున్న

| 1 | | అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఏ | ఐ | ఒ | ఔ | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ | ట | ఠ | డ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 2 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 3 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 4 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 5 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 6 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 7 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 8 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 9 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 10 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 11 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 12 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 13 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 14 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 15 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |

| 1 | | ఢ | ణ | త | థ | ద | ధ | న | ప | ఫ | బ | భ | మ | య | ర | ల | వ | శ | ష | స | హ | ళ | ఱ | క్ష |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 2 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 3 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 4 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 5 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 6 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 7 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 8 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 9 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 10 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 11 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 12 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 13 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 14 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 15 | [illegible] | | | | | | | | | | | | | | | | | | | | | | | |

సందర్భం. స్పష్టంగా బ్రాహ్మీలిపిలోని అక్షరాలు మారడం కనిపిస్తున్నది. ఎందుకనో తర్వాతికాలంలో ఇటువంటి శిలాశాసనాలు లభించలేదు. అప్పటి రాగిరేకులమీది రాతలు పూర్తిగా బ్రాహ్మీలిపి రూపం నుంచి బయటపడ్డట్టు కనిపించవు.

# 3 తొలుత తెలుగు రాతి రాత 'తొలచువాంద్రు'

కీసరగుట్ట మీద 1967లో పురావస్తుశాఖ గుర్తించిన ఈ శాసనాన్ని గురించి మాట్లాడిన చరిత్రకారులు అరుదు. ఈ శాసనకాలం 5వ శతాబ్దంలో తొలిపాదం. 2వ మాధవవర్మ క్రీ.శ.430వరకు రాజ్యం చేసాడు. ఆ తర్వాత వారి రాజధాని మారిపోయింది. కీసరగుట్ట తవ్వకాల గురించి పురావస్తుశాఖవారి వార్షికనివేదికలలో వివరించబడివుంది. శాసనాల వర్గీకరణలో భాగంగా ఈ శాసనాన్ని లేబుల్ శాసనం అంటారు కాని, శాసనమే కదా. కాలాన్ని బట్టి ఇది తెలుగులో తొలుత చెక్కిన రాతిమీద రాతే కదా. ఇదే తెలుగులో తొలి శాసనం.

తొలచువాంద్రును 'తులచువాంద్రు' అని చదివారు పెద్దలంతా. 'తులచు'కు అర్థమైతే లేదు. శాసనాలు చెక్కేవాండ్లు అక్షరాస్యులు కాకపోవడంతో కీసరగుట్ట శాసనం తప్పుగా చెక్కబడి ఉంటుంది అంటారు కొందరు చరిత్రకారులు. అంటే అది తొలచువాంద్రు అని అంగీకరిస్తూనే రాతలో తప్పు అంటున్నారు.

ఈ శాసనంలో ఇక్ష్వాకులనాటి బ్రాహ్మీలిపిశైలిలో అక్షరాల మీద సున్నాలుచుట్టి కనిపించడం పల్లవుల గ్రంథలిపిలో కూడా కనిపిస్తుంది కనుక ఈ శాసనకాలం 7వ శతాబ్దం తర్వాత అని అభిప్రాయాన్ని వ్యక్తం చేసారు చరిత్రకారులైన మిత్రులు.



(పరివర్తినిః)

కాని, గ్రంథలిపిలో కనిపించే సున్నాలన్నీ లిపిలో భాగంగా అక్షరాలకు 'గుడులు(ఇత్వాలు)'గా ఉన్నాయి. తొలచువాంద్రులో పై సున్నాలు అలంకారంగా మాత్రమే ఉన్నాయి.

తొలచువాంద్రులో 'త'కు పక్కన ఉన్నది ఉత్వమని అంటారు. సాధారణంగా బ్రాహ్మీలిపిలో కొమ్ము(ఉత్వం) ఇట్లా వుంటుంది. లోపలివైపు కొస అక్షరాన్ని తాకకుండా రాయాలి. ఇక్కడ కనిపించే కొమ్ములున్న అక్షరాలవలెనె కాకుండా తొలచువాంద్రులో కొమ్ము వంటిది అక్షరం ఎత్తుకు బయటివైపున్నది. అపుడది 'తు' కాదు కదా. 'తో' అయితే పైన ఓత్వం గుర్తుండాలి అన్నారు. అది బ్రాహ్మీలిపి పద్ధతి. బయటకు కొమ్మురాయడం లిపిపరిణామంలో చోటుచేసుకున్న మార్పుగా అంగీకరిస్తే వివాదముండదు. మన అంగీకార, అనంగీకారాలతో నిమిత్తం లేకుండానే చరిత్రలో పరిణామాలు వస్తుంటాయి. ఈ లిపిభేదాన్ని కూడా మార్పులో భాగంగానే చూడాలన్నది నా విజ్ఞప్తి.

తొలచు అనే తెలుగు క్రియావాచకానికి 'వాంన్డ్రు' అనే సర్వనామం చేరి తొలచువాంన్లు అనే సంజ్ఞావాచకం ఏర్పడ్డది. వాండ్లు, వాన్డ్రు, అనే సర్వనామాలు, కూచోంన్డ్రి, నిలబడుంన్డ్రి, పోంన్డ్రి, రాంన్డ్రి అనే క్రియావాచకపదాలు తెలంగాణా తెలుగులో సాధారణ వాడుకమాటలు. వ్యాకరణరీత్యా కూడా 'వాన్లు' అన్నమాట సరైనదేనని భాషావేత్తల అభిప్రాయం. రేనాటి చోళుల శాసనాలలో వాన్లు మాట పలుసార్లు కనిపిస్తుంది. రేనాటిచోళుల కాలం కన్నా ముందరే తెలంగాణాలో వాన్లు వాడుకం ఉందని చెప్పే శిలాసాక్ష్యం 'తొలచువాన్డ్రు'. వ్యాకరణ ప్రయోగంలో 'ర,ల'లకు అభేదం కనుక తొలుచువాన్లునే తొలుచువాండ్లు అని అంటారు.



పురావస్తుశాఖ ఎస్టాంపేజ్ (లేఖన ప్రతిబింబం):



తొలచువాన్డు

# 4 'తొలుచువాంఱ్రు' పై చరిత్రకారుల అభిప్రాయాలు

**ఈమని శివనాగిరెడ్డి, స్థపతి, చరిత్రకారులు- (హైద్రాబాద్)**

'తొలుచువాంఱ్రు' తొలితెలుగు శాసనం. నిర్ద్వంద్వంగా ఇది 5వ శతాబ్దానికి చెందిన తెలుగు పరిణామలిపి. ఒకే సమాసమైనా సంపూర్ణార్థం ఇచ్చేది వాక్యమే అవుతుంది. అందువల్ల ఈ లేఖనం శాసనమే. కలమల్ల శాసనంలో కనిపించే లిపి 6వ శతాబ్దానిది. తొలుచువాంఱ్రు 5వ శతాబ్దం ప్రథమపాదానికి చెందినది.

I agree with Haragopal sir that the two word Telugu inscription/ epigraph is the earliest one and at least 100 years prior to the very first full length telugu inscription of Kalamalla.

Two words "Tulachu Vanru" give full meaning. Based on Palaeography. Dr.Prarabrahma Sastry garu dated the Keesaragutta inscription to 5th century AD. Reg "Nagabu" it was already proved that it is an incomplete word with the last word 'ddi' missed. It is not at all a word.

Reg 'Tambaya daanam' It is 'Tambaaya daanam'

Some scholars opined that it reads as a gift of a pillar (Thamba).

**విజయకుమార్ జాదవ్, శాసనాధ్యయనవేత్త, చరిత్రకారులు, పురావస్తుశాఖ పూర్వోద్యోగులు (తిరుపతి)**

In my opinion this is beautiful ornated 5 th Century CE period script. If we observe the clear evolution of TA (త) in this form only from 5 th Century CE period only. Infact we observe a type of stylistic writing right from IKSHVAKU period including

the elongated strokes, maintaining the line and length, stylistically in this region. Here just after a gap of a Century roughly, we observe another type of different style of writing for the first time in this KEESARA GUTTA historical site on a huge boulder with highly matured and each letter is very beautifully ornated. This type of writing again we have not come across on the boulders or on stone but some same resemblance I observed on some copper plate. Here the first letter is Tu I taught but the stroke is curved and elongated stroke on the right side and it may be tuu I think on my keen observation. So it is tuu la chu va nru and mis spelt of Tho la chu va nru only. Here the scriberer made little bit mistake for pronouncing to writing.

Generally whatever the script engraved on some permanent material like stone or metal or pot or brick which will be last for a durable period can be called as inscription. No doubt it can be considered as the first Telugu inscription as we see here though it is only one word but for it there is a meaning and language is there clearly. But as it is only a label like small Inscription it can be called as LABEL INSCRIPTION ONLY.IT IS HAVING ITS IMPORTANCE AND SIGNIFICANCE AS IT IS THE FIRST ONE.Even if we observe the KANAGANA HALLI Buddist site in Karnataka containing so many label inscription for each and every BUDDIST JATHAKA Stories and another most important label inscription in Kanagana Halli is the name of the Great Mauryan EMPEROR ASOKA THE GREAT a life Sized stone figure shown along with his consort worshipping to a Buddist Stupa. This huge panel contains the label inscription as RAJA ASOKA in SATHAVAHANA period Brahmi letters. This label inscription is also containing only five letters as RA JA A SO KA like only five letters in Keesara Gutta as TU LA CHU VA NRU. We know that small label inscription of the name of ASOKA got how sensational across the country as it was the

first of it's kind to mention the name of the king. Like this the Label inscription of Tolachuvandru in Keesaragutta is also having that much of importance in TELUGU LANGUAGE with a clear meaning in that five beautiful letters. No doubt it is the first inscription but in usage it is called as LABEL INSCRIPTION in TELUGU to the best of my knowledge.

I have participated in Keesaragutta Excavation in 1983 as a skilled Labour before I entered in the DEPARTMENT (1985). I happened to see the estampage of this inscription in 1990 when I was working as an Epigraphy Assistant during the time of Sri.MUKUNDA RAO and Sri. N.S. RAMA CGANDRA MURTHY were working at Gunfoundry Head office Hyderabad.

## తేరాల సత్యనారాయణ శర్మ, చరిత్రకారులు (ఫోన్లో) (28.02.2022, 4 pm)

'తొలుచువాండ్రు' 430 ప్రాంతపు శాసనమనడంలో సందేహం, వివాదాలు అవసరం లేదు... అప్పటికి తెలుగు భాష ఎంతో అభివృద్ధి చెంది ఉన్నది. లిపి పరిణామం లెక్కన కూడా ఈ లేఖనం తొలితెలుగు శాసనమేనన్నారు.

## 'తొలుచువాండ్రు' రాతిరాతే తొలితెలుగు శాసనం: కొత్త తెలంగాణ చరిత్రబృందం

'తొలుచువాండ్రు'ను తొలితెలుగు రాతిరాత(శాసనం)గా గుర్తించాలని కొత్త తెలంగాణ చరిత్రబృందం డిమాండ్ చేసింది. 27.02.2022 కొత్త తెలంగాణ చరిత్రబృందం సభ్యులు వేముగంటి మురళీకృష్ణ నాయకత్వంలో, దీకొండ నర్సింగరావు గైడెన్సులో సభ్యులు బీవీ భద్రగిరీశ్, గుండం మోహన్ రెడ్డి, గుమ్మడిదల వేంకటరమేశ్, డా. మండల స్వామి, అహోబిలం కరుణాకర్, మహమ్మద్ నజీర్, కండాడై కృష్ణమాచార్యులు, బృందం కన్వీనర్ శ్రీరామోజు హరగోపాల్ మేడ్చల్ జిల్లా, కీసరగుట్టలోని 'తొలి తెలుగురాతిరాత(శాసనం,లేఖనం) "తొలుచువాండ్రు"న్న ప్రదేశాన్ని సందర్శించారు. ఈ రాతిరాతలోని 5 అక్షరాలు 80 నుంచి 85 సెం.మీల ఎత్తుతో, 180 సెం.మీ.ల వెడల్పున చెక్కబడ్డాయి. ఈ రాతిరాతను లిపిపరంగా 5వ శతాబ్దానికి చెందిందని ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేసారు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ పురావస్తు

శాఖ తమ 1981-82 సం.పు వార్షిక నివేదికలోని(1987ప్రచురణ) 18వ పేజీలో 5 అంశంగా శాసనం 'తొలుచువాండ్రు'గా ప్రకటించింది. కాని, ఈనాటికి ఈ లేఖనాన్ని తెలుగులో తొలి తెలుగుశాసనంగా పురావస్తుశాఖ శాసనవిభాగాలేవి ప్రకటించక పోవడం, శాసనపరిశోధకులు గణించకపోవడం శోచనీయమని సభ్యులు నిరసనను తెలియపరిచారు. ఇంత విలువైన రాతిరాత ముండ్లపొదల నడుమ గుర్తు పట్టడానికి వీలు లేకుండా ఉంది. ఈ శాసనమున్న స్థలంలో వారసత్వశాఖవారు ఈ ప్రదేశాన్ని సందర్శకులు దర్శించే విధంగా చేసి, దారిచూపే ఒక బోర్డు ఏర్పాటు చేస్తే బాగుంటుందన్నారు.

# 5

# 'శాసనోల్లంఘనం' పై జరిగిన చర్చ-కొన్ని అభిప్రాయాలు

**కొత్త తెలంగాణ చరిత్ర వాట్సప్ గ్రూపులో 09/01/2022న 'శాసనోల్లంఘనం' పై జరిగిన చర్చ-కొన్ని అభిప్రాయాలు:**

**శ్రీరామోజు హరగోపాల్ :** కలమళ్ళలో మళ్ళీ శాసనం దొరికినందుకు, ఉత్సవాలకు అభినందనలు.... పండుగే. అయితే కలమళ్ళలో దొరికింది శాసనమే (రాజాజ్ఞతో)... కాని తొలి తెలుగు లేఖనం కాదు.... పెద్దలు కీసరగుట్ట లేఖనాన్ని తొలి తెలుగు లేఖనమని అంగీకరించకపోవడం మళ్ళీ వివక్షకు తార్కాణం అవుతుంది...

తొలుచువాండ్రు తొలితెలుగు రాతిరాతగా ప్రకటించడానికి చరిత్రకారుల సహకారం కావాలి. చరిత్రకారులు, శాసనాధ్యయన వేత్తలు 'తొలుచువాండ్రు'ను బలపరుస్తూ రాసిన తమ అభిప్రాయాలను వ్యక్తిగతంగా తెలియచేయండి. పుస్తకంగా తీసుకొద్దాం.

కీసరగుట్టలో జరిపిన తవ్వకాలు విష్ణుకుండిన రాజు 2వ మాధవవర్మకాలపు నిర్మాణాలని తెలియజేసాయి. అక్కడే రాతిగుండుకు చెక్కి ఉన్న 'తొలచువాండ్రు' అనే శిలాలేఖనం లభించి 50 యేండ్లు దాటింది. మాధవవర్మ కాలం 5వ శతాబ్దం తొలినాళ్ళు కనుక ఈ శాసనం అప్పటిదేనని, లిపివేత్తలు పాలియోగ్రాఫికల్‌గా 5వ శతాబ్దమేనని తెలిపారు. నాగబు తెలుగు పదం కాదని అది 'నాగబుద్ధి'లోని శకలమని తేల్చారు చరిత్రకారులు. తంబయదానం లేఖనంలోని తంబయ అనేది వ్యక్తి నామమే. స్తంభం కాదు. 'తంబయదానం' బ్రాహ్మీలిపిలో తెలుగుమాట. అట్లంటే సాతవాహన నాణాల మీద రెండు భాషలలో రాసిన పేర్లలో ఒకటి తెలుగని (నడుంపల్లి) నిరూపించబడ్డది కదా. కర్నూలులో దొరికిన 'అంధిరలోకం' కూడా బ్రాహ్మీలో రాసిన తెలుగు మాటలే. సాతవాహన పూర్వ రాజుల పేర్లు నారన, కంవయ వంటివి నాణాలమీద బ్రాహ్మీలిపిలో రాసినవి తెలుగు పేర్లే.

ముందు తొలి తెలుగు లేఖనమని ప్రకటించాలి వారసత్వశాఖ. తర్వాత ప్రభుత్వం పాఠ్యపుస్తకాల్లో ప్రచురించాలి.

**దీకొండ నర్సింగరావు :**

1. తొలి తెలుగు శిలాలిఖితమనీ Epigraphy/ Archeology శాఖలచే గుర్తింపు ప్రకటన
2. పాఠ్యపుస్తకాలలోనూ ఆ అంశం రావాలి.

రెండూ జరగాలి. బేషజాలు వదిలి మనసు విప్పి మాట్లాడుకోవాలి. "తొలచువాండ్రు" అనే చిన్నమాట "చారిత్ర"క మార్పులకు నాంది అవుతుందేమో!

**తిరుపతి సందెవేని :** I Agree with you Sir..., చాలా మంది పెద్దలు ఉన్నారు. అద్భుతమైన సుధీర్ఘ చర్చలు చేసే పరిశోధకులు, అధ్యాపక మిత్రులు ఉన్నారు. చరిత్ర అభిమానులు ఉన్నారు. కానీ ఎవ్వరు మాట్లాడటం లేదు. మౌనం అంగీకారాన్ని ప్రకటిస్తుంది. మనకు తెలియంది కాదు. ఖచ్చితంగా కీసరలో లభించిన లేబులే తొలి తెలుగు లిఖితమని చెప్పాల్సిందే. దీని కోసం అందరం మాట్లాడాలి. లేకుంటే ఇప్పటికీ హరగోపాల్ సార్ చెప్పినట్లుగా కోటిలింగాల శాతవాహన రాజధాని అని కూడా వ్రాయడానికి చేతులు రావడం లేదనేది నిజం. మొత్తం పాఠ్యపుస్తకాలలో ఎక్కనే లేదు. ఏ ప్రాంతం వాళ్ళు ఆ ప్రాంతంనుంచే శాతవాహనులు అన్నట్లు ఇప్పటికీ వ్రాసుకుంటున్నారు.

**బండి మురళీధర్ రెడ్డి, చరిత్రకారులు:** Fact is Fact, no body can deny, it has to be accepted. History cannot be changed. Whether any body accepts or not, does not matter. Fact remains.

**బద్దెల రామచంద్రారెడ్డి, చరిత్రకారులు :** విజయకుమార్ జాదవ్ గారు క్లియర్‌గా రాసారు. మీరు చెప్పినట్లు కిసరగుట్టది తొలి శాసన లేఖనం (లేబిల్ ఇన్స్క్రిప్షన్). తొలి తెలుగు శాసనం కలమల్ల.

**మునిరత్నం కె.,** డైరెక్టర్, శాసనశాఖ, ఆర్కిలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా, మైసూరు: Correct, we are already started to collect the information in this regard. let's hope.

# 6 లేఖాయణం

సమాచారహక్కు కింద తెలంగాణ వారసత్వశాఖకు కొత్తతెలంగాణ చరిత్రబృందం తరపున రాసిన లేఖ

పౌర సమాచార అధికారి,
తెలంగాణ వారసత్వశాఖ,
తెలంగాణ వారసత్వశాఖ కార్యాలయం,
గన్ ఫౌండ్రి, ఆబిడ్స్,
హైద్రాబాద్

తేది. 17.01.2022

అయ్యా,

విషయం: కీసరగుట్ట శాసనం 'తొలుచువాండ్రు' గురించి (మేడ్చల్ జిల్లా, తెలంగాణ)

సమాచార హక్కు చట్టం-2005, సమాచారహక్కు చట్టం: సెక్షన్ 4(1)(బి) కింద

దిగువ సంతకందారుడు మీ నుంచి ఈ కింది సమాచార వివరాలను కోరుతున్నాడు.

1. 'తొలుచువాండ్రు' శాసనం ఏ శతాబ్దానికి చెందినదిగా నిర్ధారించబడ్డది. తొలితెలుగు శాసనంగా వారసత్వ శాఖ నిర్ధారించినదా? అయితే దాని వివరాలను పొందుపరచగలరు.
2. ఈ శాసనాన్ని వారసత్వశాఖ గుర్తించిన వివరాలను పొందుపరచగలరు.
3. ఈ శాసనం ఎస్టాంపేజి కాపీని ఇవ్వగలరు.
4. ఈ శాసనం ఎక్కడ ఉంది? ప్రస్తుతస్థితి ఏమిటి?

